ఎ. మిత్యాయెవ్

# గ్రీషా రోదసీ యాత్రికుడూ

చిత్రాలు: యూ. మలకానొవ్

అనువాదం: ఆర్వియార్



"రాదుగ" ప్రచురణాలయం
మాస్కో



# కొంటెపిల్లవాడు గ్రీష్క

భూగోళంమీద ఒక దేశం వుండేది. ఆ దేశంలో ఒక నగరం వుండేది. ఆ నగరంలో గ్రీష్క అనే పేరుగల ఒక చిన్న అబ్బాయి వుండేవాడు. వాడో కొంటె పిల్లాడు. కజ్జాలు పెట్టుకోవడమంటే వాడికి యిష్టం. నిజం చెప్పాలంటే, యీ భూమ్మీద వాడంతటి తుంటరి పిల్లవాడు లేడు. వాడు పెద్దవాళ్ల మాటలు వినే వాడు కాదు. తనకంటే చిన్న పిల్లల్ని యేడిపించేవాడు.

ఒక రోజున గ్రీష్క ముంగిట్లోకి వెళ్లాడు. అక్కడ మరీనా అనే చిన్న పిల్ల మూడు చక్రాల సైకిలు తొక్కుతూ వుండడం చూశాడు. గ్రీష్క ఆ పిల్లని సైకిలుమీదనుంచి తోసేసి, తను యెక్కి, దానిలో వున్న బురద గుంటల్లో తొక్కు కుపోయాడు. వాడు యెటు తొక్కినా బురద చిమ్మింది. వాడు బోలెడు సరదా పడిపోయి, యిలా పాడడం మొదలుపెట్టాడు:

గ్రీష్క మిమ్మల్ని మొట్టు
నెత్తిమీద మీకు బొప్పికట్టు!
నెత్తిమీద మీకు బొప్పికట్టు
గ్రీష్క మిమ్మల్ని మొట్టు!



ఆ రకంగా వాడు వెనక్కీ ముందుకీ సైకిలు తొక్కుతూ, ఆదీ అంతం లేకుండా పాట పాడు కుంటూ వున్నాడు. పాడడంతోటీ, సైకిలు తొక్కడంతోటీ మోహం మొత్తాక సైకిల్ని ఓ బురద గుంటలో వదిలేశాడు. వాడికేం లెక్క, కొంటె పిల్లాడు! వాడేమో రబ్బరు బూట్లు తొడుక్కున్నాడు! తన మూడు చక్రాల సైకిల్ని తీసుకోవడం కోసం మరీనా బూట్లతోటే బురద కుంటలోని నీళ్లల్లోకి వస్తుందని చూస్తూ వున్నాడు. మరీనాకి తన బూట్లు బురద అయిపోవడం యిష్టం లేదు. అందు కని ఆ పిల్ల ముందుగా ఒక యిటుకని తెచ్చింది. తర్వాత ఒక చెక్క పలకని తెచ్చింది, ఒక చిన్న వంతెన చెయ్యవచ్చని. కాని మరీనా సరిగ్గా వంతెని తయారుచేసి చేసేలోపలే, గ్రీష్క సైకిల్ని యింకో బురద కుంటలోకి దొర్లించేశాడు. మరీనాకి యెంత ఉడుకు మోత్తనం వచ్చేసిందంటే ఆ పిల్ల 'బేర్'మని యేడ్చేసింది. కాని గ్రీష్క వాడికేం పకపక నవ్వేశాడంతే. సరిగ్గా అప్పుడే పొరుగింటి వాన్య యివతలికి వచ్చాడు. అతను గ్రీష్కని మెడపట్టుకుని అన్నాడు:

''సరేరా, గ్రీష్క, ఆ సైకిల్ని తక్షణం వెనక్కి యిచ్చేయ్. తప్పించుకోవాలని చూడకు. నేను నిన్ను పట్టుకోగలను, అప్పుడు మొర్రోమంటూ ఏడ్చేట్లు చేస్తా.''

వాన్య గ్రీష్కకంటే పొడుగూ లేడు, వాడికంటే పెద్దవాడూ కాడు. కాని గ్రీష్కకి భయం పుట్టింది. నోరు మెదపకుండా వాడు బురద కుంటలోకి వెళ్లాడు. వాడు సైకిల్ని తిరిగి మరీనాకి అప్పగించడానికి తీసుకువస్తూవుంటె యీ దృశ్యం చూడ్డానికి యిరుగుపొరుగు ఆడపిల్లలంతా అక్కడ చేరారు. వాళ్లు ఓ యిరవైమంది వున్నారు. ఆ కొంటె పిల్లాడికి దండన రావడంతో ఆ యిరవైమందీ సంతోషంతో నవ్వారు. వాళ్లు నవ్వడమే కాదు, నాలికల్ని యివతలికి పెట్టి వెక్కిరిస్తూ 'హేయ్, హేయ్' అంటూ ఆటపట్టించారు. గ్రీష్కకి యెంతో తల కొట్టేసినట్టయి పోయింది.

వాడు మిద్దెమీదకి పరిగెత్తి వెళ్లిపోయి, మరీనాని వెనకేసుకువచ్చినవాడిమీద యెలా కక్షతీర్చుకోవాలా అని ఆలోచిస్తూ వుండిపోయాడు.

''వాడి కాళ్లకి యెలా మడం వేస్తానంటే వాడు దభేలుమని బురద గుంటలో పడతాడు. నీళ్లు యింటి కప్పు అంత యెత్తు చిందుతాయి!''

''లేకపోతే యింకా భేషైన పని, పక్కింటి జర్మన్ జాగిలాయిని, సరిహద్దుల్లో వాళ్లు దొంగల్ని పట్టుకున్నట్టు, వీణ్ణి నేలమీద కూలదోసి అప్పుడు ముందు పంజాలతో నొక్కెయ్యమని వుసి కొల్పుతాను.''

కసి తీర్చుకోవడానికి గ్రీష్క వేసుకున్న ప్రతి పథకమూ కూడా వాడు అంతకుముందు వూహించుకున్నదానికంటే ఉగ్రంగానే వుండింది. కాని తనకిగా తను వూహించుకున్న యీ మహా ఘన కార్యాలని వేటినీ తను యెన్నటికీ చెయ్యలేడని వాడు త్వరలోనే ఒప్పుకోవాల్సి వచ్చింది. పక్క యింటి కుక్కకి తను ఒక మాంసం ముక్కని పెట్టినా అది తన మాట వినదు. కాని తను వాన్య గాణ్ణి నీటికుంటలో పడేట్టు తొట్రుపడ చెయ్యగలడనుకోండి, కాని వాడు శుభ్రంగా యీదుకొచ్చేస్తాడు. ప్చ్, తన శత్రువు తెలివైనవాడే, నిజమే. కాని తను, గ్రీష్క, యింకొంచెం గట్టివాడైతే, అప్పుడంతా యింకోలా వుండేది! అప్పుడు తను నిజంగా యేదైనా చెయ్యగలిగేవాడు!



# గ్రీష్మ రోదసీ యాత్రీకుణ్ణి చూడడానికి వెడతాడు

అదే నగరంలో, గ్రీష్మ వుంటున్న అదే వీధిలో, ఒక రోదసీ యాత్రీకుడు వుండేవాడు. అందరు రోదసీ యాత్రీకుల లాగానూ అతనూ దయగలవాడు. యెవరేనా సహాయం గాని, సలహా గాని అడిగితే యెప్పుడూ ఆసరా వుండేవాడు. తాము యేవేనా కథలు వినాలనుకున్నా, లేదా కాస్త టీ తాగి అప్పచ్చులు తినాలనుకున్నా, లేదా వూరికే గూటీ బిళ్ల ఆడుకోవాలనుకున్నా ఆ వూళ్లో వుండే పిల్లలు అతని దగ్గర చేరేవాళ్లు. మంచం యెక్కి యెక్కగానే యెలా నిద్రపోవాలో కూడా అతను పిల్లలకి చెప్పేవాడు. కొంతమంది పిల్లలు అటు కదుల్తారు, యిటు కదుల్తారు, రాగాలు తీస్తారు, యేవో కథలు చెప్పమంటారు గాని యెంతకీ నిద్రపోరు. కాని ఒక రోదసీ యాత్రీకుడికి రోదసీ నౌకలో వున్నప్పుడు, పడుకొమ్మని భూమిమీద నుంచి ఆజ్ఞ రాగానే అతను వెంటనే పడుకుని నిద్ర పోతాడు. అదే ఆ రోదసీ యాత్రీకుడు పిల్లలకి నేర్పాడు.

"రోదసీ యాత్రీకుడు యేమైనా గానీ యిట్టే చెయ్యగలడు" అనుకున్నాడు గ్రీష్మ, మిద్దె మీద కూర్చుని. "అతను బహుశా నన్ను బలంగా చేస్తాడు. అతన్ని కలుసుకుంటే బాగుంటుంది."

గ్రీష్మ రోదసీ యాత్రీకుణ్ణి చూడ్డానికి వెళ్లాడు. ఆ రోదసీ యాత్రీకుడు వాణ్ణి తన గదిలోకి తీసుకెళ్లి, కూర్చోమని చెప్పి, అడిగాడు:

"యేం యిలా వచ్చావు? ఓ కప్పు టీ కావాలా? యిదిగో యిప్పుడే కెటిల్ సిద్ధం చేస్తా, యేం, లేకపోతే నీ మనసులో యేమన్నా యింకోటుందా?"

"మరేం లేదు, వూరికే, యేం" అని గ్రీష్మ గొణిగాడు. కొంచెం చిక్కబట్టుకుని, "మీరు దేన్నేనా చెయ్యగలరని అంటారు. నిజమేనా?" అన్నాడు.

"అవును" అని రోదసీ యాత్రీకుడు జవాబు చెప్పాడు. ఆ మాట గ్రీష్మకి బోలెడు సంతోషం కలిగించింది.

"అయితే నన్ను బలంగా చెయ్యండి. నన్ను యెంత బలంగానంటే.... యెంత బలంగానంటే.... యేమో మరి నాకు తెలీదు!" అన్నాడు.

"సరే. అలాగే" అని రోదసీ యాత్రీకుడు ఒప్పుకున్నాడు. "కాని, చెప్పు, యెందుకు కొండంత బలం నీకు?"

అలాంటి ప్రశ్నకి గ్రీష్మ చాల భయపడ్డాడు. కాని యేం చెయ్యడం? నిజం చెప్పితీరాలి.

"వాన్యగాణ్ణి చితగ్గొట్టెయ్యడానికి. ఆడపిల్లలందరి ముందూ వాడు నన్ను లేవిడీ కొట్టించి గాడిదని చేశాడు. వాళ్లు నవ్వి నన్ను వెక్కిరిపించారు."

"అదీ సంగతి" అన్నాడు రోదసీ యాత్రీకుడు విచారంగా. "నాకు యిప్పుడు అర్థం అయింది. యెప్పుడూ పోట్లాడే పిల్లలంటే నాకు యిష్టం వుండదు, తెలుసా. కాని నేను ఆడిన మాట





తప్పేవాణ్ణి గాదు. నిన్ను బలంగా చేస్తానని అన్నానా, చేస్తాను. రోదసీ నౌకలు ప్రయోగించే స్థావరంలోకి వెళ్లడానికి యిదిగో ప్రత్యేకమైన పాస్. నా రోదసీ నౌకని తీసుకుని చంద్రుని దగ్గరకి బలం సంపాదించడానికి వెళ్లు. అక్కడ తగినంత బలం లేదని అనిపిస్తే, అక్కడికి అతి దగ్గర్లో వుండే చిన్నగోళం దగ్గరకి నువ్వు వెళ్లవచ్చు. కాని జాగ్రత్త, రోదసిలో తప్పిపోకుండా చూసుకో. యిదిగో పటం— దీనిమీద రూటు అంతా గుర్తుపెట్టి వుంది. అయినా గుర్తుంచుకో చంద్రుడికి అటు పక్క, యిటు పక్క మరో రెండు చంద్రగ్రహాలు వున్నాయి. భూమి లాగావే పెద్దవి. మనం వాటిని చూడలేం, యేమంటే అవి ధూళితో తయారైనవి. ధూళితో తయారైన చంద్రగ్రహాలమీద నువ్వు చెయ్యగలిగింది యేమీ లేదు.''

''యేమిటి మీ అభిప్రాయం, యేమీ చెయ్యలేమంటే?'' అని అడిగాడు గ్రీష్క. ''రోదసీ నౌక దుమ్ము కొట్టుకుపోతుందని భయపడుతున్నారా? నేను తిరిగి వచ్చాక దాన్ని శుభ్రంగా తుడుస్తా.''

''వుహుఁ, విషయం అది కాదు'' అని రోదసీ యాత్రికుడు నవ్వాడు. ''నువ్వు సరాసరి చంద్రుడి గుండా యెగిరిపోగలవు, అసలా సంగతిని నువ్వు గమనించను కూడా లేవు. అంచేత నీ రాకెట్ యింధనాన్ని వృధాచేసుకోకు. మంచిది, క్షేమంగా వెళ్లి లాభంగా తిరిగిరా!''

# గ్రీష్క భూమిమీదనుంచి బయల్దేరతాడు

గ్రీష్కకి యెంత సంతోషం కలిగిందంటే వాడు దాన్ని నమ్మలేకపోయాడు. వాడు ప్రయోగ కేంద్రం దాకా పరిగెత్తుతూనే వెళ్లాడు. అంతసేపూ భయమే! రోదసీ యాత్రికుడు మనసు మార్చుకుంటాడేమో. పాస్ వెనక్కి తీసేసుకుంటాడేమో. అసలు అల్లరి చిల్లరిగా వున్నందుకు బాగా చీవాట్లు పెడతాడేమో! అని బెదురే. కాని అబ్బే, యెవరూ వాణ్ణి దారిలో ఆపలేదు. ప్రయోగ స్థావరం దగ్గర వుండే సిబ్బంది వాణ్ణి కలుసుకుని మర్యాదగా, బాగా చూశారు. గ్రీష్క రోదసీ దుస్తులు వేసుకునేందుకూ, రోదసీ నౌకలోకి యెక్కేందుకూ వాళ్లు సాయం చేశారు. అక్కడ వున్న ఆచారం ప్రకారం వాడు సంతోషంగా భూమికి తిరిగి రావాలనీ, జయప్రదంగా వాడి రోదసీ నౌక నేలమీదకి దిగాలనీ ఆశీర్వదించారు.

యింజన్లని స్టార్టు చేశారు. రాకెట్టు సిమెంటు దిమ్మిసా చేసిన చప్టా మీదనుంచి బయల్దేరి, భూమిమీదనుంచి లేచింది. నౌక కిటికీలోనుంచి బూరుగు చెట్ల చిటారు కొమ్మలు, కాకి గూళ్లు పక్కన దూసుకుపోవడం గ్రీష్కకి కనిపించింది. ''మొదటి అంతస్తు దాటి పోయింది'' అని గ్రీష్క గుర్తుపెట్టుకున్నాడు.

వాడు ఆకాశంలో రెండవ అంతస్తు చేరుకునేటప్పటికి రోదసీ నౌక బాగా యెత్తుకి ఎగిరే స్విఫ్ట్ పిట్టల గుంపుని దాటి పోయింది. స్విఫ్ట్‌లు యెత్తుగా, వేగంగా యెగురుతాయి, కాని రోదసీ నౌకలు యింకా యెత్తుగా, యింకా వేగంగా యెగురుతాయి! త్వరలోనే ఆ పిట్టలూ వెనకబడిపోయాయి.

ఆకాశపు మూడో అంతస్తు అంతా నీలం మేఘమే నిండిపోయింది. చుట్టూతా వాన పడుతోంది. కాని అదీ యెక్కువ సేపు లేదు. రాకెట్టు వానపైకి యెగిరింది, అంతట్లోనే మంచు తరకలు రోదసీ నౌక కిటికీ పక్క సుళ్లు తిరుగుతూ వున్నాయి. కన్ను పొడుచుకున్నా కనిపించని హిమ పాతం! అదన్నమాట! వాన మంచుతో మొదలవుతుందన్న మాట! మేఘాల మాటున ముద్ద కట్టించేసే చలిగా వుంది. భూమిమీద వుండే వెచ్చని గాలిపొరలోకి వచ్చినప్పుడే యీ మంచు స్ఫటికాలు కరుగుతాయి, నీటి బిందువులు అవుతాయి.

రాకెట్టు సరిగ్గా మేఘం మధ్యలో వుండగా రోదసీ నౌక గది అంతా మెరిసే నీలపు కాంతితో నిండిపోయింది. అది ఓ మాదిరి దూరంలో మెరిసిన మెరుపు. కాని గ్రీష్కకి ఉరుము వినబడలేదు — రాకెట్టు యింజన్లు ఉరుముకంటే యెక్కువ భీకరంగా గర్జిస్తున్నాయి మరి!

సరే మేఘం కూడా కింద అయిపోయింది. అది భూమిమీద తెల్లటి దూది పింజలా వేలాడుతూ వుంది. శీతాకాలంలో మంచు కరుళ్లతో కప్పేసిన పొలం లాగా కూడా వుంది అది. ఆ తెల్లటి కొండ వెనకనుంచి స్కీయింగ్ చేసే బృందం ఒకటి వస్తుందని కూడా గ్రీష్క అనుకున్నాడు. లేకపోతే ఓ స్లెడ్జి బండికి పూన్చిన గుర్రమో....

అయితే, అలాంటివి జరగవులెండి. కాని ఆకాశపు నాలుగో అంతస్తుమీద, మేఘాలకి పైన,

ఒక పెద్ద జెట్ విమానం యెగిరింది. గ్రీష్క దాని కేసి చెయ్యి వూపాడు. మరి ఆ విమానం కూడా, బూరుగు చెట్ల లాగా, పక్షుల్లాగా, మేఘంలాగా, వెనకబడి పోయింది.

యిక పైన సూర్యుడు కాంతివంతంగా ప్రకాశిస్తున్నాడు. ఆ యెండకి యిప్పుడు యే అడ్డూలేదు. దాని దారిలో యే ఆటంకమూ లేదు. యేమంటే యిది బాహ్యరోదసికి సరిహద్దు. ఒక్క చంద్రుడి వెలవెలబోయే పసుపుపచ్చని వృత్తం మాత్రమే సూర్యుడికి ఒక వైపున కనిపిస్తోంది. గ్రీష్క రాకెట్టు యీ వృత్తపు కేంద్రం కేసే పోతోంది.

భూమినుంచి రోదసీ నౌక యెంత దూరం పోతే ఆకాశం అంత చీకటై పోయింది. ఆఖరికి అది మొత్తం నల్లబడి పోయింది, మసిలాగా లేకపోతే బూటు పాలిష్ లాగా. ఆ చీకటి ఆకాశంలో సుదూర నక్షత్రాలు యెన్నడూ లేనంతగా మిలమిల మెరిసిపోయాయి.

గ్రీష్క వెనక్కి చూశాడు. వాడి వెనక్కాల భూమి చిన్నగా అయిపోయింది, వెలవెలబోయే నీలపు బంతిలా అయిపోయింది. యెక్కణ్నో దూరంగా వున్న నీలపు భూమిని చూడ్డంతోటి గ్రీష్కకి విచారం కలిగింది. ఆ సమయంలో ఆ రాకెట్టులో యెవరేనా వాడి పక్కన వుండి వుంటే వాళ్లు గ్రీష్కని చూసి జాలిపడేవాళ్లు.



# గ్రీష్క చంద్రుడిమీద దిగడం

గ్రీష్క నౌక కిటికీ దగ్గర కంటూ మొహం ఆన్చి చంద్రుడిమీదకి కిందకి చూశాడు. ఒక్క నది కాని, సరస్సు గాని, అడివి గాని లేవు. అంత దాకా యెందుకు, ఒక్క చెట్టు కూడా మచ్చుకి లేదు. ఒట్టి కచిక రంగు, పసుప్పచ్చ రాళ్ల మైదానాలు, ఆ మైదానాలమీద పర్వతాలు తప్ప యేం లేవు. భూమ్మీద అయితే పర్వతాలు ఒక లైనులో వరసగా వుంటాయి. కాని చంద్రుడిమీద అవి ఉంగరా లల్లా వున్నాయి, మంచి కథ వినడం కోసం గుండ్రంగా చేరి కూర్చున్నట్టు!

చంద్రుడిమీద పర్వతాలు గ్రీష్కకి వాళ్ల ముంగిటిని గుర్తుకు తెచ్చాయి. అక్కడ ఆడపిల్లలు ఒకళ్లతో ఒకళ్లు గుసగుస లాడుతూ, యికిలించుకుంటూ, తనని ఆట పట్టిస్తూ అలాగే గుండ్రంగా పోగవుతారు. తను మిద్దెమీద కూర్చున్నప్పుడు గ్రీష్కకి వాళ్లు బాగా కనిపించారు. ''సరే, సరే'' అనుకున్నాడు తను. ''మీకు చూపిస్తా. నవ్వుతూనే వుండండి — రెండు తగిలించే దాకా అలాగే వుండండి.''

గ్రీష్క దారుణంగా పగతీర్చుకునే మార్గాల గురించి ఆలోచించాడని మనకి తెలుసుకదా. కాని యిప్పుడు వాడికి దేన్ని గురించీ ఆలోచించే వ్యవధి లేకపోయింది: రాకెట్టు చంద్రుడిమీద దిగింది. వాడు బయటికి రావాల్సివచ్చింది. వాడు చంద్రుడి నేలమీద కాలు పెట్టీ పెట్టగానే కాలుజారి వెల్ల కిలా పడ్డాడు. ఆ పడ్డంవల్ల వాడికి దెబ్బ తగల్లే దనుకోండి — ఓ మాదిరి మెల్లగా పడ్డట్టు వాడు గమనించాడు. ఓ సారి భూమ్మీద పక్కనున్న మంచుమీద వాడు యెలా జారాడంటే, చుక్కలు కని పించేటట్టు దభేలుమని పడ్డాడు. కాని చంద్రుడిమీద అసలు దెబ్బే తగల్లేదు — ఆ మాటకొస్తే అది భలే వుందని కూడా అనచ్చు.



గ్రీష్క యిటు ఒత్తిగిలి, తన యెదురుగుండా యేం వుందో జాగ్రత్తగా చూశాడు. చుట్టూతా కూడా నేలంతా చిన్న గాజు పూసలు చల్లినట్టు వుండటం కనిపించింది. వాడి బూట్ల కింద దొర్లినవి అవే. చంద్రుడి ఉపరితలంమీద జారేటట్టు చేసేవి అవే.

''వాటిని యెవరు పరిచారిక్కడ? నేను కొంచెం జాగ్రత్తగా వుండటం మంచిది'' అనుకున్నాడు వాడు.

జాగ్రత్తగా వుండాలనుకున్న మాట వాడు కొంచెం సేపట్లోనే మరిచిపోయాడు. తను భూమ్మీద గొప్ప ఛాంపియన్ల అంత యెత్తూ, అంత దూరమూ యెగరగలనని వాడు అనుకున్నాడు. వాడు వెడల్పాటి కందకాలమీద సునాయాసంగా యెగిరాడు. పెద్ద పెద్ద రాళ్లమీదనుంచి గెంతిపోయాడు — మరి చిక్కులో పడ్డాడు. ఒక సారి వాడు గెంతింతర్వాత ఓ గోతిలో పడిపోయాడు. అదృష్టవశాత్తూ ఆ గొయ్యి మరీ లోతు లేదు కాని వాడు దురదృష్టవశాత్తూ ఒక పెద్ద బండరాతిని ఢీకొన్నాడు. అది ఆ గోతిమీదకి దొర్లిపోయింది, గ్రీష్క లోపల వుండిపోయాడు.

గ్రీష్క ఆ గోతిలో ముడుచుకుని కూర్చున్నాడు. వాడికి యెంతో విచారకరమైన ఆలోచనలు వచ్చాయి. వాడికి అమ్మా నాన్నా గుర్తువచ్చారు — తను యెక్కడికి వెడుతున్నదీ వాళ్లకి చెప్పను కూడా చెప్పలేదు. తనిప్పుడిహ ఆ రాకెట్టుని రోదసీ యాత్రికుడికి యివ్వలేనీ వాడికి తట్టింది.

కాళ్లు అసౌకర్యంగా వుండేటట్టు కూర్చున్నాడు. దాంతో వాడి కాళ్లు తిమ్మిరెక్కడం మొదలెట్టాయి. కొంచెం చాచుకుందా మనుకున్నాడు. అందుకుగాను వాడు బూట్లతోటి గోతి నేలమీద అదమాల్సివచ్చింది, శిరస్త్రాణంతోటి బండరాతిని తాకాల్సివచ్చింది. యేం చిత్రం! బండరాయి



కొద్దిగా లేచింది. అప్పుడు గ్రీష్కా దాన్ని తన చేతులతో తోసి, ఓ పక్కకి దొర్లించేశాడు. గ్రీష్కాకి పట్టలేనంత సంతోషం కలిగింది! తను మళ్లీ బయటపడ్డాడు! తనకి బలం కూడా వచ్చింది! ఛ, రోదసీ యాత్రికుడు తనని వెర్రి వాణ్ణి చేసి యేడిపించలేదు. అన్న మాట నిలబెట్టుకున్నాడు.

గ్రీష్కా ఈ బండరాతిని దొర్లించడం మొదలుపెట్టాడు. ఉత్త పీపాని దొర్లించినంత సునాయాసంగా వుందది, వాడికి అసలు పిసరు కూడా అలసటే అనిపించలేదు.

సరిగ్గా ఆ క్షణంలో ఒక ఉల్కా — బాహ్య రోదసినుంచి జారిపడే శిల — గ్రీష్కా ముందట్నే చంద్రుడి నేలమీద పడింది. అది యెంతో ధాటీగా పడింది, దాంతోటి నేల వేడి యెక్కిపోయి, మరు క్షణంలోనే సరిగ్గా నీళ్లల్లాగా కళపెళలాడటం మొదలుపెట్టింది. ఆ మాట కొస్తే ఆవిరి కూడా లేచింది.

అది గ్రీష్కాకి భయం కలిగించింది. అతను ఆగాడు. ఆ ఉల్కా గనక తన రోదసీ దుస్తుల్ని తాకి వుంటే అప్పుడు వుండేవి పాట్లు. కాస్త భయం తగ్గి గ్రీష్కా స్థిమిత పడే లోపునే యేదో వాడి శిరస్త్రాణాన్ని మొట్టింది. అది ఓ మాదిరి వానలా ధ్వనించింది. అది నిజంగా వానే — చంద్రుడి మీది వాన. గ్రీష్కా దోసిలి పట్టాడు — దాన్నిండా ఆ చిన్న గాజు పూసలు పడ్డాయి. చంద్రుడి ఉపరి తలంమీద అంతా వున్న లాంటివే. "అంచేత చంద్రుడిమీద పూసలు అలా వస్తాయన్న మాట" అని గ్రీష్కా వూహించుకున్నాడు. భూమ్మీద అయితే నీరు ఆవిరిగా మారిపోతుంది. ఆకాశంలో యెత్తున, చల్లగా వున్న చోట, నీటి ఆవిరి మంచు స్ఫటికాల్లా మారి అప్పుడు వడగళ్లలా పడుతుంది. చంద్రుడి మీద శిల ఆవిరిగా మారిపోతుంది. అంచేత వాన కురిసినప్పుడు, అది చిన్నచిన్న రాళ్లతో తయారై వుంటుంది. భూమిమీద మేఘాలు చాలా పెద్దగా వుంటాయి, ఒకో అప్పుడు వాటినుంచి వాన ఒక వారం వారం అంతా కురుస్తూనే వుంటుంది. కాని యిక్కడ చంద్రుడిమీది వాన కొన్ని క్షణాల పాటే వుంటుంది.

"నేను వెళ్లిపోవడం మంచిది" అని తీర్మానించుకున్నాడు గ్రీష్కా. "యెవడికి తెలుసు, యిది నన్ను చంపేస్తుందేమో కూడాను. నేను ఒక చిన్నగోళంలోకి వెళ్లి మరి కొంచెం బలం సంపాదిస్తాను. అప్పుడు యింటికి పోయే వేళ అవుతుంది" అనుకున్నాడు.

# చిన్నగోళంమీద గ్రీష్క

రాకెట్ నౌక చిన్నగోళం దగ్గరగా రాగానే గ్రీష్కకి చాలా ఆశ్చర్యం వేసింది: యెంత చిన్న గ్రహం, ఒక్క మైలు పొడుగూ, అరమైలు వెడల్పూ అంతే. అది గుండ్రంగా లేదు, దోసకాయలా వుంది. కాని యింకా ఆశ్చర్యకరంగా వున్న విషయం యేమంటే ఆ చిన్న గ్రహంమీద ఒక రాకెట్టు నుంచుని వుంది.

లోపల యెవరున్నట్టు? తను సంతోషపడాలో, చీకుపడాలో గ్రీష్కకి తెలియలేదు. ''నేను చూడాలి'' అనుకుని, వాడు తన రాకెట్‌ని దాని పక్కకి తీసుకొచ్చాడు.

వాడు నిచ్చెన మీదనుంచి, రోదసీ నౌకలోనుంచి దిగుతూ, పైనుంచి చూశాడు. ఆ రెండో రాకెట్ పక్కన చేతిలో తాటి చుట్ట పట్టుకుని రోదసీ దుస్తులు వేసుకున్నతను యెవరో నుంచున్నాడు.

''వాడికి తాడు యెందుకబ్బా?'' అనుకున్నాడు గ్రీష్క ఆతృతగా. ''నాకు నచ్చనిది యేదో యిక్కడ వుంది'' అనుకున్నాడు.

గ్రీష్క నిచ్చెన ఆఖరి మెట్టుమీదనుంచి కిందికి గెంతాడు. వాడి కాళ్ళు చిన్నగోళాన్ని తాకీ తాకగానే వాడు యెగిరిపోవడం మొదలుపెట్టాడు, యేదో అంతా గాలితో నిండిపోయిన బంతిలాగా.

ఆ క్షణంలో ఆ కొత్త మనిషి తన చెయ్యి విసిరి, గ్రీష్క కాలికి ఉచ్చుతాడు తగిలేటట్టు వేసి ఉచ్చు బిగించేశాడు. గ్రీష్క చిన్నగోళంమీద రోదసిలో వేలాడుతూ వుండగా ఆ కొత్త వ్యక్తి తాటి రెండో చివరని గ్రీష్క రాకెట్‌కి ముడివేసి, అప్పుడు వాణ్ణి కిందికి లాగడం మొదలుపెట్టాడు.

ఆఖరికి చిన్నగోళంమీద నిలబడి, గ్రీష్క కొత్త మనిషి శిరస్త్రాణం గుండా అతని ముఖం చూద్దుడు కదా, అతను వాన్యా! అందర్లోకీ!

గ్రీష్క దేనికేనా సిద్ధమే దానికి తప్ప!

మంచి వాడుగా నటనలు పోయే వాన్య భూమ్మీద తనని తగలేసింది చాలకనా, మళ్లీ యిక్కడికీ యెగిరివచ్చాడు! దానికితోడు తనకి ఉచ్చు తాటిని వెయ్యడం కూడానూ! అబ్బ, అది గ్రీష్క భరించలేడు. వాడు వాన్య దగ్గరికి నడిచి వెళ్లి వాడి ఛాతీమీద ఒక్క దెబ్బ వేశాడు. ఆ క్షణంలోనే గ్రీష్క, వాన్య యిద్దరూ ఒకళ్లనుంచి ఒకళ్లు రబ్బరు బంతుల్లా దూరం యెగిరిపోయారు.

కొన్ని పిల్లి మొగ్గలు వేశాక వాళ్లు పైకి యెగిరారు. వాన్య కూడా తన రాకెట్టుకి తాడుతో కట్టేసుకున్నాడు. దాంతోటి యిద్దరు పిల్లలూ వాళ్ల తాళ్ల చివర రబ్బరు బుడగల్లా దొర్లారు.

''యేం మందమతివిరా నువ్వు'' అని వాన్య గొంతుక అంటూ వుండటం చెవిలో పెట్టుకున్న ఫోన్‌ద్వారా గ్రీష్కకి వినిపించింది. ''ఆ రోదసీ యాత్రీకుడు నన్ను యిక్కడికి పంపించాడు. ముందస్తుగా రాకెట్టుకి తాడుతో కట్టేసుకోకుండా చిన్నగోళంమీదకి దిగవద్దని నీకు చెప్పాలని అనుకుంటూనే ఆయన మర్చిపోయాట్ట. నువ్వు చంద్రుడిమీద వున్నప్పుడు నేను యెకాయెకీ యిక్కడికి వచ్చేశాను.

నేను గనక నిన్ను ఉచ్చు తాడుతో పట్టుకోకపోయి వుంటేనా యిహ అంతే సంగతులు, నువ్వు బాహ్య రోదసిలో ఉల్కలాగా యెప్పటికి యెగురుతూ వుండేవాడివి.

''భూమ్మీద మామూలుగా నడవడం నీకు అలవాటు. అది పెద్దదీ, గురుత్వాకర్షణ శక్తి యెక్కువ వున్నదీనీ. కాని యీ చిన్నగోళం యెంత చిన్నదంటే, యిది సరిగ్గా దేన్నీ యథాస్థానంలో వుంచలేదు. యిక్కడి ప్రతీదీ భారరహితమే. అర్థమైందా? నువ్వు దాన్ని చంద్రుడిమీదనే వూహించి వుండాల్సింది. యిప్పుడు నన్ను చూడు, నేను చేసినట్టే చెయ్యి.''

వాన్య తాటిని చేత్తో లాక్కోవడం మొదలెట్టాడు. అతను చిన్నగోళంమీదకి దిగివచ్చాడు. రాళ్ల మధ్య చిన్న గోతిని చూసి, కాళ్లు దాంట్లో తన్ని పట్టాడు యెగిరిపోకుండా వుండాలని.

గ్రీష్క యింకా చిన్నగోళంమీద యెగురుతూనే వున్నాడు. జీవితంలో మొట్టమొదటి సారిగా వాడు సిగ్గుతో చిమిడిపోయాడు. వాడు యిక్కడ, తనని రక్షించడం కోసం హడావుడిగా పరిగెత్తుకుని వచ్చాడు. తను, గ్రీష్క వాణ్ణి చితక కొట్టాలని అనుకున్నాడు. అది నిజంగా అధ్వాన్నం, కదూ?

ఆ రకంగా గ్రీష్క ఆ చిన్నగోళంమీద పైన పిల్లి మొగ్గలు వేస్తూ వుండగా తనని తను నిందించుకున్నాడు.

చుట్టూతా అంతా కూడా లక్షలాది తెల్లని నక్షత్రాలు చల్లబడివున్న విశ్వపు నల్లని రోదసి. ఆ నల్లని నేపథ్యంలో సూర్య బింబం తేజోవంతంగా వెలుగుతోంది. చంద్ర బింబం పసుపు పచ్చగా మెరుస్తోంది. భూగోళం నీలంగా మెరుస్తోంది.

''ఒరేయ్, జోగుతున్నావా? కిందికి రా, వాలీబాల్ ఆడుకుందాం'' అంటూ పరిచితమైన గొంతుక గ్రీష్కకి వినిపించింది.

గ్రీష్క చిన్నగోళపు ఉపరితలంమీదకి దిగివచ్చాడు. తన కాళ్ళని కూడా గోతిలో తన్ని పెట్టాడు. ఆటకి సిద్ధం అయాడు.

నిజమే, యిక్కడ వాలీబాల్ యేలా ఆడాలో వాడు వూహించలేదు పైగా పెద్దగా బంతి కూడా లేదు.

యీ లోపున ఒక పెద్ద భోషాణం లాంటి బండరాతి కిందకి వాన్య పాకి దాన్ని ఒక్క తోపు తోశాడు. అది గిరగిరా తిరుగుతూ, చాలా నెమ్మదిగా తనకి యిష్టం లేదన్నట్టుగా, గ్రీష్క కేసి యెగిరివచ్చింది.

''భూమ్మీద పది టన్నుల బరువు వుండేది యిక్కడ రెండు పౌన్లు మాత్రమే వుంటుంది. అంచేత భయపడకు'' అని రేడియోద్వారా అరిచి చెప్పాడు వాన్య.

''యిక్కడ ప్రతీదీ భార రహితమే'' అని యిందాకా అన్న మాటలు గ్రీష్కకి గుర్తువచ్చాయి.

గ్రీష్క వేళ్లని వెడల్పుగా చాచి బండరాతిని గెంటి దాన్ని తిరిగి వాన్య దగ్గరికి పంపించాడు. అది నిజంగా చూడాల్సిన దృశ్యం!



తర్వాత వాన్య బండరాతిని ఫుట్‌బాల్ ఆటగాడిలా తన్నాడు. అది బాహ్య రోదసిలోకి దొర్లు కుంటూ పోయింది. సూర్యుడు, చంద్రుడు, భూమి, నక్షత్రాలు దాటి పోయే ప్రయాణం ఆరంభించింది అది.

అది ఒక ఉల్క అయిపోయింది.

"ఒరేయ్, అది ఉల్క అయిపోయింది" అన్నాడు వాన్య.

ఉల్కలంటే యేమిటో గ్రీష్కకి తెలుసు. వాడు సైన్సు పాఠంలో చదువుకున్నాడు. రాలిపడి పోయే ఉల్కలని చూసే మనుషులు నక్షత్రాలు రాలిపోతున్నాయనుకుంటారు!

ఒక రోజున యెప్పుడో యిప్పుడు రోదసిలోకి దొర్లుకుంటూ పోయిన యీ రాయీ భూమి దారికి అడ్డం వస్తుంది. అది గనక రాత్రి వేళ అయితే మనుషులకి ఆకాశంలో తేజో రేఖ కనిపిస్తుంది — వాతావరణంలో మండిపోతూ, తెల్లగా ప్రకాశించే బండరాతి జాడ.

ఉల్కలని చెయ్యడం వాళ్లకి సరదాగా వుండింది. ఒక దాని తర్వాత ఒకటిగా వాళ్లు రాళ్లని గెంటేశారు. ఆఖరికి, కలిసి తోస్తూ, వాళ్లు బస్సు అంత పెద్దగా వున్న బండరాతిని బాహ్య రోదసిలోకి పంపేశారు.

# తిరిగి యింటికి!

రెండు రాకెట్లూ ఒకే సారి బయల్దేరి భూమికి ప్రయాణం అయాయి. అవి పక్క పక్కనే యెగిరాయి; ఒక దాన్ని దాటి యింకోటి పోలేదు, ఒక దాన్ని యింకోటి వెనక వదిలెయ్య లేదు— యిద్దరు మిత్రులు నగరంలోని ఒక రోడ్డుమీదనో, నేలమీద మైదానం దారిలోనో కలిసికట్టుగా నడిచినట్టు. రాకెట్లు సగం దారిలోకి రాగానే, రోదసీ యాత్రికుడు వాళ్లతో రేడియో సంబంధాలు పెట్టుకున్నాడు.

''ద్రోబ పజాలొవాచ్'' (స్వాగతం!) అని అతను వాళ్లని అభినందించాడు. ''మీ ప్రయాణం యెలా జరిగింది?'' అని కుశలం అడిగాడు.

తమ ప్రయాణం యెలా సాగిందో, తాము చంద్రుడిమీదా, చిన్నగోళంమీదా యెలా దిగారో వాళ్లు అతనికి చెప్పారు.

''మీకేమన్నా సందేహాలున్నాయేమో అడగండి'' అని ఆ పిల్లలకి చెప్పాడతను. గ్రీష్క తనకో సందేహం వుందన్నాడు.

''నేను చిన్నగోళంమీద వున్నంత బలంగా భూమిమీద వుంటానా?'' అదీ వాడు అడిగింది.

''వుహుఁ'' అని రోదసీ యాత్రికుడు జవాబు చెప్పాడు. ''భూమిమీద నువ్వు అంతకు ముందు వున్నంత బలంగానూ వుంటావంతే! మామూలుగా బతకడం కోసం నువ్వు యింత కంటే బలంగా వుండక్కర్లేదు. నీకు మరీ యెక్కువ బలం వుంటే నువ్వు బోలెడు నష్టం, హాని కలిగిస్తావని యీ పాటికి నీకు తెలిసి వుండాలి. నువ్వూ వాన్య కలిసి ఆ చిన్నగోళాన్ని ఉల్కల కింద చితక కొట్టేసి వుండే వాళ్లు. మీరు ఒక గోళం మొత్తాన్ని ధ్వంసం చేసేసి వుండేవాళ్లు, అది నలుసంతే వుండి, నిర్జనంగా వున్నప్పటికీ కూడా.''

''థాంక్యూ'' అని గ్రీష్క రోదసీ యాత్రికుడికి చెప్పాడు. మరి భూమిమీదకి దిగివచ్చాక ముందటి కంటే యెక్కువ బలవంతుడేం కాలేదు గ్రీష్క. కాని ముందటికంటే యెంతో తెలివైన వాడు అయాడు.



